

# హరి, సర్కస్

క్రాకెట్ జాన్సన్

# హరి, సర్కస్

క్రాకెట్ జాన్సన్





వెన్నెల రాత్రి. తాను చెయ్యగలనని

నిరూపించటం కోసం బిగుతుగా కట్టిన తాడు

మీద హరి నడవసాగాడు.



తాడు ఊగకుండా ఉండటానికి దానిని

తిన్నగా, గట్టిగా కట్టాడు హరి.

ఆ తాడు మీద హరి చిన్నగా గెంతాడు.

మిగిలిన సర్కస్ కంటే ఎంతో ఎత్తున

తాడు మీద నడిచే ప్రదర్శన ఇవ్వటం

హరికి బాగుంది.









తాడు మీద అలవోకగా హరి ఎన్నో

విన్యాసాలు చేశాడు. కానీ చివరికి

అతడి పట్టు తప్పింది...

తాడు మీద నుంచి కింద పడటం

కూడా తేలికగానే ఉంది.





కిందకి పడుతున్న హరి గాలిలో పల్టీలు కొట్టాడు.

వంగ వన్నె క్రేయాన్ అతడి చేతిలోనే ఉంది.

అదృష్టవశాత్తు అతడి కింద ఒక

మెత్తటి ఒంపు కనపడింది.



ఒక ఏనుగు తొండం మీద పడ్డాడు హరి.



అలా తనని పట్టుకోవటం గొప్పే

అనుకున్న హరి బహుమతిగా ఏనుగుకి

ఒక పెద్ద వేరుశనగ కాయ పెట్టాడు.



ఏనుగులు చాలా పెద్ద జంతువులు!

హరి ఇంకా నేలకి చాలా ఎత్తులోనే ఉన్నాడు.



దాంతో అతడు ఏనుగు తొండం మీద నుంచి

ఒక జంతువు మెడ మీదకి దూకాడు.



అది అందమైన సర్కస్ గుర్రం. బాగా శిక్షణ పొందింది.

అందుకే హరి దానిని తేలికగా పరిగెత్తించగలిగాడు.



గుర్రం మీద జీను లేకుండానే హరి సవారీ

చేస్తూ, చక్కని ప్రదర్శన ఇచ్చాడు.



చివరికి అతడు గుర్రం మీద నుంచి

హుందాగా దూకాడు.

అయితే అతడు విచిత్రమైన పల్టీ కొట్టి,

ఇబ్బందికరంగా కింద పడ్డాడు.



ఇతరులు ఎవ్వరూ నవ్వక ముందే

కావాలని అలా చేసినట్టు హరి నటించాడు.



వెంటనే బఫూన్లు పెట్టుకునే టోపీని

హరి పెట్టుకున్నాడు.



ఇప్పుడు హరి ముఖాన బఫూన్ నవ్వు ఉంది. బఫూన్
లాగానే అతడి చేష్టలతో అందరినీ నవ్విస్తున్నాడు.



చివరికి అతడు ముఖం నుంచి ఆ నవ్వుని,
తల మీద నుంచి టోపీని తీసేశా .



టోపీని బఫూన్‌కి తిరిగి ఇచ్చేశాడు.



అసలు బఫూన్ ఎంతో నవ్వించాడు. అతడి

చేష్టలను చూసి హరి నవ్వుతూనే ఉన్నాడు.



తన జీవితంలో ఇంత కంటే మంచి సర్కస్

చూడలేదని అనుకున్నాడు హరి.



అన్నీ సర్కస్‌లలో ఉన్నట్టే ఆ సర్కస్‌లో

కూడా ఒక లావుపాటి మహిళ ఉంది.



ఆమె నిజంగా అందరూ
ఆశ్చర్యపోయేటంత లావుగా ఉంది.

అలాగే, ఒక పొడవాటి మనిషి కూడా ఉన్నాడు.



అతడు నిజంగా చాలా,
చాలా పొడుగ్గా ఉన్నాడు.



అతడి పక్కనే చాలా చిన్న మనిషి ఉన్నాడు.



ఆ పక్కనే నిమ్మ రసం అమ్మే
మరొక మనిషి ఉన్నాడు.



నిమ్మ రసంతో నిండిన ఒక పెద్ద
పాత్ర అక్కడ ఉంది.







స్ట్రాతో హరి ఒక గ్లాసు నిమ్మ రసం తాగాడు. దాంతో

అతడిలో ఉత్సాహం తిరిగి నిండుకుంది.

నిమ్మ రసానికి డబ్బులు బల్ల మీద పెట్టి, ఫిరంగి నుంచి

బయటకు పేల్చే మనిషిని వెదుకుతూ హరి బయలుదేరాడు.









ఫిరంగి నుంచి బయటకు పేల్చే మనిషి ఎలా

ఉంటాడో హరికి ఏమాత్రం తెలియదు.

ఫిరంగి దాదాపు పూర్తి అయ్యింది కానీ,

ఆ మనిషి జాడ ఎక్కడా లేదు.



సర్కస్ ఎంతమాత్రం ఆగటానికి లేదు.

ఇప్పుడు ఒకే ఒక్క దారి ఉంది.



ఫిరంగిలో హరి సరిగ్గా

సరిపోయాడు.





తరవాత అతడు ఆ ఫిరంగి నుంచి పేల్చబడ్డాడు.

అతడు అందులో కూర్చున్నాడు.



అతడు వేగంగా పైకి దూసుకుని వెళ్లాడు.

ఉయ్యాల బల్ల మీద, రింగులతో సర్కస్‌లో అందరి

కంటే పైన ఉండే చోటుకి హరి చేరుకున్నాడు.









హరి తన చేతిని చాచాడు.

గాలిలో ఊగుతున్న ఒక రింగును పట్టుకున్నాడు.





దానితో హరి చాలా ఎత్తుకి ఊగాడు.

తరవాత హరి రింగును వదిలిపెట్టి గాలిలో

పల్టీలు కొడుతూ కిందకి రాసాగాడు.







తనని మళ్లీ పట్టుకోటానికి కింద ఏనుగు

ఉంటుందన్న నమ్మకం హరికి ఉంది.

మరోసారి ఊరటనిచ్చే వంపు గీత

కనపడింది.



అయితే, ఈసారి కింద పడినప్పుడు చాలా

గట్టిగా ఉండటం అతడికి ఆశ్చర్యం

కలిగించింది. అది ఏనుగు తొండం కాదు.



అది సింహం తోక. ఆ సింహం బోను

నుంచి ఎలాగో బయటకు వచ్చింది.





ఇతరులు ప్రమాదాన్ని గుర్తించి, ఆందోళన చెందక ముందే

హరి ఆ సింహాన్ని బోనులో పెట్టే పనిలోకి దిగాడు.

ఆ క్రమంలో హరి కూడా బోనులో ఉండిపోయాడు.

లోపల సింహానికి శిక్షణనిచ్చే వ్యక్తి కుర్చీ తప్ప ఏమీ లేదు.



సాహసి అయిన శిక్షకుడి లాగా

సింహాన్ని ఏదుర్కొన్నాడు హరి.

భయాన్ని పక్కన పెట్టి అతడు తన

తలని సింహం నోట్లో పెట్టాడు.



తన తలని సింహం నోట్లోంచి బయటకి తీసిన తరవాత దానికి

చాలా పదునైన కోరలు ఉన్నాయని హరి గ్రహించాడు.

తాను ఎంత సాహస కార్యం చేశాడో

గుర్తించిన తరవాత అతడికి భయం వేసింది.



సింహం బోను నుంచి బయటకు వస్తున్న హరి తనకి ఎలా

అనిపించిందన్నది ముఖ్యం కాదనుకున్నాడు.



సర్కస్‌కి వచ్చిన వాళ్లని సంతోష

పరచటమే ముఖ్యమైన పని.



సర్కస్‌కి వచ్చిన వాళ్లందరి ముఖాల

మీద నవ్వు ఉండటం హరి చూశాడు.

ఇంతమందిని సంతోషపరచటం

హరికి చాలా సంతోషంగా ఉంది.





వంగి అందరికీ అభివాదం చేస్తున్న అతడి

ముఖంలో కూడా నవ్వు అలుముకుంది.

అయిపోయింది